

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015385

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# హరిముకుందశతకము

—:గ్రంథకర్త:—

గోబ్రిడ్డి నాగిరెడ్డి

శ్రీరస్తు

# హరిముకుంద శతకము

సీ॥ శ్రీ రవికులజు నా - శ్రితజన మందారు
నజు నచ్యుతుని గూర్చి - నతులొనర్తు
కోటి భాస్కరుకాంతి - గోటమీటు కిరీట
మునుదాల్చు వాని - నింపొదవఁ గొల్తు
కౌస్తుభమణిహార - కంకణ కేయూర
ధారికి భక్తిని - దండమిడుదు
సిరి యురంబునగల్గు - సరసిజోదరుఁ గృష్ణు
హరికిఁ బరేశు జో - హారొనర్తు

గీ॥ భవవినుత నాదిదేవునిం - బ్రణుతిజేసి
సీసపద్యంబులొసఁగితి - చిత్తగింపు
భువిని పందులకుంట సత్పురనివాస
అరసి నన్నేలు గోవింద హరి ముకుంద

సీ॥ ఇభరాజవదను నే - నింపార నుతియింతు
పద్మజురాణి నేఁ - బ్రస్తుతింతు
పర్వతపుత్రి నే - భక్తితో సేవింతు
భార్గవిఁ బ్రీతితో - బ్రణుతిఁ జేతు
అంగజుపగవాని హరు - వ్యోమకేశుని
మూఁడుకన్నులవాని - మొగి నుతింతు
కనకగర్భు విరించి - ఘనుని ప్రజాపతి
స్రష్టను నామది - సన్నుతింతు

గీ॥ అష్టదిక్పాలకుల నెల్ల - నాత్మఁదలఁతుఁ
గరుణ నాదగు - కవనంబు గరిమ బ్రోవ

సీ॥ వ్యాస వాల్మీకి బిల్హ - ణ కాళిదాసాది
ఘనులగు గీర్వాణ - కవులఁ దలఁచి
బమ్మెరపోతన - తిమ్మనామాత్యుని
సమ్మతి నామది - సంస్మరించి
అలసానిపెద్దన న - నఘు శ్రీనాథుని
నన్నయార్యుని మది - సతులొనర్చి
తిక్కనార్యుని జయ - దేవు భాస్కరకవి
శ్రీరంగనాథుకు - శిరము మోడ్చి

గీ॥ రామకృష్ణుని ధూర్జటి - రక్తిఁ దలఁచి
నీదు కృతిఁజేయఁ బూనితి - నిశ్చలముగ

అందరిలో ఘనం - బండఁజూడఁగ లేదు
కోరిక లెవ్వియుఁ - గోర లేదు
విద్వాంసుఁడనుచు నే - విఱ్ఱవీగఁగ లేదు
దర్పించి పేర్మి నీ - దలఁప లేదు
కవినని కృతిఁజేయఁ - గడఁగి బూనఁగ లేదు
శాస్త్రంబు లెవ్వియుఁ - జదువ లేదు
గణయతిప్రాస ల - క్షణముఁ జూడఁగ లేఁ
గురుముఖంబున విద్య - నరయ లేదు

గీ॥ శ్రీరమానాథ నీభక్తి - చేతఁ గాక
బూనగా నేను నీకృతిఁ - బూర్తి సేయ 4

సీ॥ దండంబు దండంబు - దశరథాత్మజ నీకు
దండంబు విమల - వేదండ పోష
దండంబు దండంబు - దశరూపధర నీకు
దండంబు శార్ఙ్గ - కోదండపాణి
దండంబు దండంబు - ధాత్రీరమణ నీకు
దండంబు బుధజనా - ధార మూర్తి
దండంబు దండంబు - దశకంఠ సంహార
దండంబు జ్ఞాన - తత్వస్వరూప

గీ॥ దండములు మీకు పదివేలు - దానవారి
దండిదయఁజూడ నీకృతి - తప్పువిడిచి 5

సీ॥ వసుధలో నీయంత - వా రెవ్వరునులేరు
వైకుంఠపతి నీకు - వందనంబు
దాసదాసులఁ బ్రోవ - దైవంబు నీవె గా
వసుమతీనాయకా - వందనంబు
పాడిదప్పనివారి - పాలనం బొనరించు
వనరుహాక్షా నీకు - వందనంబు
భక్తపాలన హరీ - పరమాత్మ పరమేశ
వాసవార్చిత నీకు - వందనంబు

గీ॥ వనజభవ భవహార నీకు - వందనంబు
నందనందన విశ్వాత్మ - వందనంబు 6

సీ॥ శబరిరక్షక మిమ్ము - స్మరియింతు నిరతంబు
పరమపావన మీకు - శరణు శరణు
పగవాని తమ్ముని - పరిపాలన మొనర్చు
శరణాగతత్రాణ - శరణు శరణు
తరు మూషికంబును - దయఁ దలిర్పఁగఁ బ్రోచు
శాంతి ప్రదాయక - శరణు శరణు
ఆర్తుల మానుల - నరసి సంరక్షించు
సాధురక్షక మీకు - శరణు శరణు

గీ॥ సర్వపరిపాల లక్ష్మీశ - శరణు శరణు
హర ముఖామరవందిత - శరణు శరణు 7

సీ॥ సురల రక్షింపఁగ న - సురుల శిక్షింప
దశరథతనయుఁడై - తనరినావు
క్రూర దానవులను - గూల్చి యజ్ఞముఁగాచి
జడధారులకు బ్రీతి - సల్పి నావు
హర ధనుర్భంగంబు - నవలీల గావించి
యవనితనూజఁ బెం - డ్లాడినావు
భృత్యులు బాంధవుల్ - బ్రణతులై మిముగొల్వ
పురమునకే తేర - బూనినావు

గీ॥ పరశురాముని గర్వంబుఁ - బాపినావు
బంధుజనులను సంతోష - పరచినావు 8

సీ॥ కైకేయి వరముల - కారణంబున నీదు
జనకుని యానతి - సల్పలేదె
జనకజ లక్ష్మణ - సహితంబుగా వని
కరుగుచు గుహుఁ - బ్రీతిఁ గాంచలేదె
ముని భరద్వాజు స - మ్మోదాబ్ధిఁ దేలించి
చిత్రకూటాద్రినిఁ - జేరలేదె
పరమభక్తుండైన - భరతుఁడు ప్రార్థింప
పాదుకల్దయనిచ్చి - పనుపలేదె

గీ॥ దండకాటవిలోఁ జొచ్చి - తాపసులకు
నిచ్చ లిగురొత్త - నభయంబు లియ్యలేదె 9

సీ॥ రామా పరంధామ - రక్షింపరా యని
పలుమారు బిలిచిన - పలుకవేమి
నారాయణా హరీ - నారసింహా యని
బిలిచిన నోయని - బలుక వేమి
కృష్ణ జనార్దన - కృపజూడరా యని
బలురీతులను వేడఁ - బలుక వేమి
కమలలోచన నిన్ను - గానక చేసరి
సొలసి బేర్కొన్నను - బలుక వేమి

గీ॥ వివిధరీతులఁ జేరినే - వేడుకొన్న
బలుక వదియేమి - నాదగుపాపమయ్య 10

సీ॥ కాముకియగు దైత్య - గాదిలి చెలియలి
ముక్కు చెవులను గోసి - మొక్క పరచి
దండకాటవి చతు - ర్దశ సహస్రామర
ప్రతిపక్ష సైన్యంబు - హతమొనర్చి
మాయావియగు తాట - కేయుని పసమాపి
జానకి శోకకుఁ - జాల నొచ్చి
బహుదుష్టుఁడైన క - బంధుని బరిమార్చి
శబరిచే మన్ననల్ - జాల వడసి

గీ॥ తపన సుతునకు - నభయంబు దయ నొసంగి
వాలిఁ గూలంగ నేసితె - కోల నొకట 11

సీ॥ భూభార ముడగింపఁ - బూని దేవకిగర్భ
వారాసి శశిపోలె - వరలినావు
మందలో నందుని - కందవై క్రేపుల
మేపుచు నీయేపుఁ - జూపినావు
కన్నులు దెఱువని - కాలమందే దైత్య
కాండంబులను దుంచి - గ్రాలినావు
వ్రేతల యిండ్లలో - వేవిధంబుల వెన్న
మీఁగడల్ కడుపార - మెక్కినావు

గీ॥ వల్లవస్త్రీల మానంబు - కొల్లలాడి
వారి కొసఁగితివయ్యా - కైవల్య పదవి 12

సీ॥ అర్జున తరువుల - నవనిపైఁ బడఁగూల్చి
యక్షేశ సుతుల - ను నరయలేదె
గోవర్ధనంబును - గొడుగుపోలిక నెత్తి
యల బిడౌజుని - గర్వమడఁచలేదె
భ్రమజెందలోకంబు - యమునలోపలఁ జొచ్చి
క్రూరు కాళీయునిఁ - గూల్పలేదె
గోగోపకుల చుట్టి - క్రూరమౌ దావాగ్ని
కబళించ వారలఁ - గావలేదె

గీ॥ శత్రుపక్షంబువాఁడని - చిన్నబుచ్చ
కెలమి నక్రూరుఁ బ్రోచితి - వేర్పడంగ 13

సీ॥ కైవల్యపదమిచ్చి - ఘనుని సుదాసుని
నింపుమీరఁగఁ - జూచి యేలినావు
సుమములుగొని శుభ - మమర మాలికునకు
మెచ్చి సౌభాగ్యంబు - లిచ్చినావు
మైపూఁతఁగొని కుబ్జ - మన్నించి వక్రత
మానిపి సురతంబు - మఱపినావు
మధురాపురస్థిత - మధురాధరల చూడ్కి
ధన్యత నందంగ - దనరి నావు
గీ॥ కువలయాపీడ గజమును - గూల్చినావు
దుష్టు కంసాసురునిఁబట్టి - దునిమినావు 14

సీ॥ కన్నెత్తి జూడరా - కరుణ పాలించరా
మన్నన జేయరా - మాని పోష
మనవి యాలింపరా - మమత పోషింపరా
శేషాహిశయన యో - చిత్ప్రకాశ
కోపం బదేలరా - కోరిక లీడేర్చి
బ్రోవరా నను వేగ - పుణ్యపురుష
ఎంచరా మదిని పా - లించరా నన్ను బో
షించరా బ్రీతి మ - న్నించివేగ
గీ॥ కరుణగలవాఁడ వనినమ్మి - కరములొగ్గి
వేడికొనుచుంటి ననుగావ - వేయటంచు 15

సీ॥ మీనమై వారాసి - లోన సోమకుఁ ద్రుంచి
తెచ్చి వేదము వేధ - కిచ్చినటుల
కూర్మమై మందర - కుధరంబు వడి నెత్తి
యమరుల కభయంబు - నరపి నటుల
కిటివగుచు కనకాక్షు - గీటడంచియు ధరా
తరుణిని గాఁగిటఁ - దాల్చినటుల
నరసింహ మూర్తివై - సురవైరిఁ బరిమార్చి
ప్రహ్లాదు బాధలఁ - బాపినటుల

గీ॥ మంచితనమున బలిని - మన్నించినటుల
చేరి నను బ్రోవ రావయ్య - చిత్తగించి 16

సీ॥ మాతృగర్భంబున - మలమూత్రముల నుండి
ధరణి జన్మించిన - దాదిగాఁగ
నిసువునై బాధల - విసివి వాపోవుచుఁ
గడపితి కాలంబు - కంజనాభ
ఆటపాటల సొక్కి - యటకొన్నినాళ్ళు నీ
సేవఁజేయఁగనైతి - శ్రీనివాస
కూటికై విద్యల - గొమరొప్ప నేర్వఁగ
కాలంబు వ్యర్థమై - గడచె కొంత

గీ॥ అరయ జన్మంబునొందిన - దాదిగాఁగ
బ్రతుకు వ్యర్థము మీదయఁ - బడయు దనుక 17

సీ॥ జవ్వనంబున లేచు - సంగతి మదినిడి
యానిశంబు మిమ్ము నే - నరయనైతి
రక్తిమై బుత్రగాత్రీ - శ్లేషములయందు
జిక్కి నీయెడ మతిఁ - జేర్పనైతి
చటుల సంసార దుఃఖ - టవార్ధినిఁ బడి
నీస్తుతి నావగా - నెగడనైతి
వృద్ధత్వమున చింత - పీడక సుతసుతా
దులఁజిక్కి మిమ్ము నే - గొలువనైతి

గీ॥ అకటపెంపొందె - నాశ లహర్నిశంబు
జీవితంబును తనువుతో - జీర్ణమయ్యె 18

సీ॥ గురుదక్షిణార్థమై - గోరసాందీపుని
మెచ్చి వేడుకఁబుత్రు - నిచ్చినావు
ముచికుందునకుఁ బ్రీతి - మోక్షమిచ్చిసుపర్వ
వైరులఁబరిమార్చి - వైచినావు
అంబుధి మధ్యంబు - నల ద్వారకాపురి
నిర్మించి సిరిమించి - నెగడినావు
వైదర్భివలరాజు - వాదంబు వారించి
నర్మిలి రుక్మిణిఁ - గూర్మినేలి

గీ॥ ఖాండవము నరునిచేతను - గాల్పజేసి
నావు నిన్నెన్నఁదరమె - నాయంతవాఁడు 19

సీ॥ తల్లికిఁ దల్లివై దయ - దలిర్పఁగ మమ్ము
గాపాడ హరి - పూటకాపువీవె
తండ్రికిఁ దండ్రివై - దాక్షిణ్య యుక్తి మై
రక్షింపఁగాను భా - రమ్ము నీవె
గురులకు గురుఁడవై - కోర్కెలింపారంగ
నెలమి పోషింపఁగ - నెవరునీవె
దేవతలకునెల్ల - దేవుండ వీవె గా
మోక్ష సామ్రాజ్యంబు - మూలమీవె
గీ॥ అన్నివిధముల రక్షింప - నాథుఁడీవె
సర్వవిశ్వముఁ జూచెడి - సాక్షివీవె 20

సీ॥ వాసిగా నీకథల్ - వ్రాతమన్నను నేను
విద్యావిహీనుఁడ - విశ్వమందు
భక్తిమైనీనామ - పఠనఁ జేయుదమన్న
మమత నిరోధించె - మనమునందు
పూనినిన్నే వేళఁ - బూజఁజేయుదమన్న
తాపత్రియంబులఁ - దవిలియుందు
కమలేశనీదగు - కథలు విందమటన్న
సంసార క్లేశముల్ - జాలగలవు
గీ॥ ఇట్టి చిక్కులఁ దరియించు - టెట్టులనుచు
జేరినాఁడను నీపాద - సరసిజముల 21

సీ॥ దశముఖానుజు నీవు - దయఁజూచి బ్రోవవె
దశరథతనయ నా - తప్పదేమి?
కల్యాణరామ నీ - కరుణజూపఁగ రమ్మ
నీసరిదైవంబు నే - నెఱుంగ
మిత్రవంశోద్ధార - మేలమాయిది నీకు
మనమున మిమ్మ యే - మారి యెఱుఁగ
శ్రీశ దామోదర - భాసురాంగ గిరీశ
వాసవవిధినుత - భావమెఱిఁగి

గీ॥ నన్ను నేలిన నీ కేమి - వన్నె జెడును
కరుణనేలుము గిరిజారి - ఖలవిదారి 22

సీ॥ ధాతనుగన్నట్టి - తమ్మి పొక్కిలితోడ
తొగలనుమించు కం - దోయితోడ
దుష్టులఁ బొఱిగొను - తూణంబు విలుతోడ
శరులఁ గూల్చెడి సుద - ర్శనముతోడ
నిత్యాను పాయియై - నెగడెడురమ తోడ
మంగళకర వన - మాలతోడ
నీలమేఘచ్ఛాయ - నెగడు దేహముతోడ
కౌస్తుభకలిత - వక్షంబుతోడ

గీ॥ కనుల పండువుగాగను - గానుపించి
భక్తుఁడగునన్ను - రక్షింపు పరమపురష 23

సీ॥ జలచరవృత్తినై - జలధి లోపలనుండ
నేదిక్కుగలదు తో - డెవరు మీకు
కూర్మాకృతిని మహా - కూపారమున నుండ
నేదిక్కుగలదు తో - డెవరు మీకు
కిటిరూపమై ధాత్రి - క్రిందనుంటిరి గదా
నేదిక్కుగలదు తో - డెవరు మీకు
దంభాకృతినిఁబూని - డాగియుంటిరిగదా
నేదిక్కుగలదు తో - డెవరు మీకు

గీ॥ అన్ని దిక్కులు మీయందె - యణఁగియుండు
దిక్కులకు నెల్ల నీవెగా - దిక్కుచూడ 24

సీ॥ పర్వత గుహలందు - పాషాణముల యందు
సర్వాత్మ నీమూర్తి - సంచ రించు
తరులతాదులయందు - తాపసావళియందు
సర్వాత్మ నీమూర్తి - సంచరించు
సకల జీవులయందు - సర్వసస్యములందు
సర్వాత్మ నీమూర్తి - సంచరించు
బయులులోపల న - భంబందు దిక్కులయందు
సర్వాత్మ నీమూర్తి - సంచరించు

గీ॥ సకల జగములు నీయందె సంచ రించు
సర్వజగములు నీవెగా - సత్యమరయ 25

సీ॥ అడవి మృగంబుల - కాహార మొవడిచ్చె
కట్టుబట్టుకవానిఁ - గాచె నెవఁడు
పక్షుల కెవ్వఁడు - ఫలములు గల్పించె
అండంబులో శిశు - వరయు నెవఁడు
రాతిలోఁ గప్పకు - మేత నెవ్వఁ డొసంగె
నీరు జంతువులకు - నిచ్చె నెవఁడు
శీతోష్ణములనుఁర్వి - నేతీరున జనించె
ఘనములు వర్షము - గురియు నెట్లు
గీ॥ పాంచభౌతిక మాయ - ప్రపంచమునను
నన్నిటికి నీవు కర్తవు - హర్తవరయ 26

సీ॥ బీజంబునను జెట్లు - పిలక యెట్లుజనించె
జనియించి వృద్ధియై - వెలఁగుచుండు
గర్భంబునను నెట్లు - నర్భకుండు జనించె
వలనుగా లోనెట్లు - వృద్ధి నుండు
దేహంబునకు నెట్లు - తేజముద్భవమయ్యె
చైతన్య మెబ్భంగి - జేరి యుండు
జ్ఞానంబు ధానెట్లు - ఘటియించె దేహికి
నెట్లు వర్థిల్లుచు - నెఱుకపడక
గీ॥ జీవులకు వృద్ధి - క్షీణముల్ జెందు నెట్లు
మెటుల స్మరియింతు నీమాయ - నెఱుగరాదు

సీ॥ వేదంబులును నీవె - వేదాంతములు నీవె
శాస్త్రంబులందలి - చర్చనీవె
యాగంబులును నీవె - యాజకుండవు నీవె
యజ్ఞఫలప్రదా య - కుఁడ వీవె
వ్రతములెన్నగనీవె - వ్రతకర్తయును నీవె
యందున ఫలమియ్య - నరయనీవె
ధాతవునీవె యా - ధారవస్తువు నీవె
దానభోక్తవు హరి - దలఁప నీవె
గీ॥ లేదు నీవుండనిది - యెందులేదు నిజము
నన్నిభంగుల వర్తింతు - వబ్జనాభ 28

సీ॥ నాదవినోద యా - నారదుఁ డిచ్చ సం
గీతంబునను మిమ్ము - గీర్తి సలుపు
పంచమ వేదంబు - పరగఁజేసి పరాశ
రాత్మజుం డెపుడు మి - మ్మాత్మ నిలుపు
రామకథాసుధా - రసము నించి ప్రచేత
నాత్మభవుండు మి - మ్మాత్మదలచు
దాల్భ్యుడు మిముభక్తి - దలఁచి కల్పంబుల
దాక జీవించియు - వీక నిలుపు
గీ॥ మఱియు దక్కిన మును లెల్ల - మదనజనక
నిన్ను సేవించి మోక్షంబు - గన్నవారె 29

సీ॥ నారాయణా మిమ్ము - నమ్మిపారాయణం
జేయువారికి నెట్టి - చెఱుపులేదు
భగవంత నీయెడ - భక్తిగల్గిన వారి
కరయ నాయమునిచే - వెఱపులేదు
శ్రీనాథ మిము నమ్మి - సేవించు వారికి
దారిద్ర్యమను భీతి - దగులు కొనదు
కేశవా మిమ్మెపుడు - కీర్తించు వారికి
నిల భవబంధముల్ - కలుగఁబోవు

గీ॥ విశ్వపావన నీభక్త - వితతికెల్ల
నెట్టి కలుషంబు దరిజేర - దెప్పుడైన 30

సీ॥ మాధవనామంబు - మరువకుండెడివార
లేవేళ పూజ్యులై - వెలయఁ గలరు
విష్ణునామంబును - వేనుతించెడి వారు
బహుళ రోగంబులు - బాయగలరు
హరినామ చింతన - మనిశంబుఁ గలవారు
కష్టముల్ గడముట్ట - గాంచఁ గలరు
దామోదరుని భక్తి - దలఁగ కుండెడివారు
బహువిధకీర్తులు - బడయఁ గలరు

గీ॥ చక్రిచింతన మనిశంబు - జరుపువార
లిలనుబుట్టుట గిట్టుట - నెఱుఁగఁ బోరు 31

సీ॥ సకల దివ్యౌషధ - సహిత నగేంద్రంబు
లెవని శల్యంబులై - యేపుమీరు
భూరి నదీనదంబులు - నే మహాత్ముని
నాడీ సమూహమై - నవనిఁబారు
భాస్కరు చంద్రు లె - వ్వడగను నేత్రయు
గంబునై మిక్కిలి - డంబు మీరు
వరుస బ్రహ్మాండ మె - వ్వని రూపమగుచును
యోగంబు పృథ్వి - నింపార మీరు

గీ॥ అట్టి విశ్వాత్మ విశ్వజ - నైక వేద్యు
నాదిపురుషుని నేనెంతు - నాత్మయందు 32

సీ॥ గ్రాహంబు ఖండించి - కరిరాజుఁ గరుణచే
నెంచి రక్షించి త - న్నేలి నావు
శబరి యెంగిలిపండ్లు - చవిచూచి భక్తికి
మెచ్చి కైవల్యంబు - నిచ్చినావు
దూర్వాసమౌనికి - గర్వంబు దూలించి
నాభాగుసుతుఁ బ్రీతి - నరసి నావు
బాలుఁడౌ నొత్తాన - పాదు తపంబున
కిచ్చమెచ్చి వరంబు - లిచ్చినావు

గీ॥ అసురవరుని ఘంటాకర్ణు - నాదరించి
నీదుదర్శన మొసఁగితి - నిర్మలాత్మ 33

సీ॥ కర్ణరంధ్రముల నీ - కథలను విననోప
జేతుల మిము బూజ - సేయనోప
కనులను నీమూర్తిఁ - గనుగొనఁగా నోప
నాదయాళికి భక్తి - నరుగనోప
మానసంబున మిమ్ము - మఱి భజింపఁగనోప
బూనినాలుకను నీ - బొగడనోప
చిత్తంబు నీయెడఁ - జేర్చి యుండఁగనోప
నీదాసులను గూడి - నిలువనోప

గీ॥ ఇంద్రియము లెవ్వియును నాదు - యిచ్చఁబోలఁది
జనవు నేనేమి సేయుదు - జలజనాభ 34

సీ॥ పాపాత్ముఁడనటంచు - పద్మలోచన నన్ను
విడనాడఁ బోకు శ్రీ - వేదవేద్య
తప్పులున్ననుగాని - దయఁ దలిర్పఁగ బ్రోవు
వలదు నీజన్మంబు - వాస వంద్య
వనజాప్తసుతుచేత - వనటఁ బొందింపఁగా
నీమమయ్యెనె నీకు - నిగమవేద్య
నీదుభక్తి నొసంగి - నిర్మలుగాఁజేసి
జన్మంబు కడతేర్చు - జలజనయన

గీ॥ అఖిల జగముల యందు నీ - కన్న నన్ను
గాచువారెవరు లేరు ని - క్కమ్మసుమ్మ 35

సీ॥ తల్లి గర్భమునుండి - ధరణి జన్మించుట
యాదిగా బుణ్యంబు - నరయనైతి
చేయ తి దానంబుఁ - జేయ నేరఁగనైతి
తీర్థోత్సవములకుఁ - దిరుగనైతి
సాధుజనాదుల - సంగతిఁగననైతి
దలకొని మిమ్మెప్డు - దలఁపనైతి
ఇతరుల సౌభాగ్య - మిచ్చనోర్వఁగనైతి
వ్రత ధర్మముల యందు - వరలనైతి

గీ॥ ఇట్టివానికి సుగతి తా - నెట్టుగలుగు
ననుచు నిర్దయఁజూడకు - నళిననాభ 36

సీ॥ అపరపయోరాసి - యస్తమించిన రవి
పూర్వ దిక్తటమున - బొడముటెట్లు
కృష్ణపక్షంబున - గృశియించు శశి శుక్ల
పక్షంబు నందున - పెరిగలుటెట్లు
కడలి నీరంబున - గ్రహియించు మేఘముల్
వసుధపై వర్షించు - వడువదెట్లు
గగనంబునను దార - కలు సంచరించుచు
పొందికై మీరంగ - బొదలుటెట్లు

గీ॥ నీదు నాజ్ఞనువర్తించు - నిక్కముగను
నన్నిటికి సూత్రధారివి - కన్న తండ్రి 37

సీ॥ పృథ్విజ వెతుకంగ - బుత్తెంచు వప్పుడు
గాఢ్పపట్టి కొసంగు - గారవంబు
రణభీతుఁడై పారు - రవిసుతు నోదార్చి
యనికి బంపిన నీద - యూరసంబు
బంధుధిక్కృతుఁడౌచు - బరగమిం జేరిన
యవ్విభీషణుకిచ్చు - నాదరంబు
భరతు కన్ననుమున్నె - భక్తి కిరాఁతకు
నరయ బుత్తెంచిన - యవసరంబు

గీ॥ నీదుదాసునిపై కొంత - నెమ్మిజూపి
కూర్మిరక్షించుమయ్య గా - కుత్సతిలకా 38

సీ॥ తారకమంత్రంబు - తా జపించెడు వారు
తాపత్రియములందు - దగులబోరు
నీనామ కీర్తన - నెమ్మి సల్పెడివారు
భవబంధముల జిక్కి - బాధబడరు
నీనివాసము జొచ్చి - నీభక్తులగువారు
సమవర్తి లోకంబు - సరణిజనరు
నీపాదతీర్థంబు - నెమ్మిమై గ్రహియింప
బలిమి రోగంబుల - పాలుగారు

గీ॥ విమలగుణస్సదు చరితంబు - వినెడివారు
వేఱుగాధలు వీనుల - వినఁగబోరు 39

సీ॥ ఎముకల నెన్నియో - నిమ్ముగా గొఱికిన
సారమేయంబు కే - సరియు నగునె
కడుపుబ్బ జేసి పె - క్కుడుములపాలైన
రక్తి భేకంబు తు - రంగ మగునె
తలమొల నేకమై - తగ బలుపెక్కిన
జంబుకం బరయ గ - జంబునగునె
ఖద్యోతముల పేరు - గాంచినంతనె మిణు
వురుపుర్వు రవికన్న - నుష్ణమగునె
గీ॥ పంగ నామంబులను బెట్టి - పరగ శుంఠ
పరుఁడు భజియించినంతనె - భక్తుఁడౌనె 40

సీ॥ సప్తాంబురాసులు - సకల పర్వతములు
జాలగా నీకీర్తి - జాటుచుండు
పదునాల్గు భువనముల్ - పంచ భూతంబులు
జాలగా నీకీర్తి - జాటుచుండు
ఖరకరుండును రిక్క - గములు చంద్రుండును
జాలగా నీకీర్తి - జాటుచుండు
స్థావర జంగమ - సకల జీవాళులు
చాలగా నీకీర్తి - జాటుచుండు
గీ॥ ఎన్నొ విధముల నడిగాన - కున్నవాడ
విశ్వకలితుండ వీవన్న - విబుధవినుత 41

సీ॥ బదరికావనమును - పండరీపురమును
శ్రీద్వారకా పురి - శేషగిరియు
శ్రీరంగ క్షేత్రంబు - సింహ గిరీంద్రంబు
భద్రగిరీంద్రంబు - బద్రపురము
యమునాది తీర్థంబు - నా ప్రయాగంబును
బురుషోత్తమ నివాస - బురవరంబు
గాంచీవరంబును - ఘన పక్షితీర్థంబు
కనకాద్రిని మించు - ఖాద్రిపురము

గీ॥ నీవు నివసించెదు ప్రధాన - నిలయములను
నరయగా నైతి - పాపుడ యరసిబ్రోవు 42

సీ॥ కాసితీర్థానసే - కడ తేరుదామన్న
చన్నీళ్ళమునుగ న - శక్యమయ్యె
తీర్థ యాత్రలకైన - దిరిగి చూతమటన్న
గాళ్ళ నొప్పులచేతఁ - గష్టమయ్యె
దానంబు లొనరించి - దన్యుఁడౌద మటన్న
దారిద్ర్య దోషంబు - తెప్పదయ్యె
నుపవాస వ్రతముల - నొగిసల్పుదామన్న
నాకలికిని దేహ - మవశమయ్యె

గీ॥ ఇట్టి కష్టంబు లేను - భరింపఁజాల
నీదు కీర్తనసల్పెద - నిక్కముగను 43

సీ॥ హరి మందిరమునకు - నరిగినంత నెజాలు
హరియు సాక్షాత్కార - మైనయట్లు
కరములజేర్చి యా - కరివరదుని బాడ
కనకపు కడియాలు - గలిగినట్లు
జిహ్వకు రుచిగ నృ - సింహుని వేడిన
నవనీత పాకంబు - నమలినట్లు
విష్ణు చారిత్రముల్ - వీనుల విన్నను
కర్ణకుండలములు - గలిగినట్లు
గీ॥ లోకవంద్యుని జూచిన - లోచనములు
పరమ ధన్యంబు లంచని - బలుకవలదె 44

సీ॥ కమలలోచన నన్ను - గన్నతండ్రి వటంచు
నిన్ను నమ్మితినయ్య - నిజముగాను
కమలాక్షి శ్రీలక్ష్మి - కన్నతల్లియటంచు
నిరతము నమ్మితి - నిజముగాను
నీదుదాసులు నాకు - నిజసహోదరులంచు
నిజముగ నమ్మితి - నీరజాక్ష
అనఘాత్మ నీయాలయము - నికుంఠంబని
నీపదములు గొల్తు - నిజముగాను
గీ॥ నిత్యమమరులు నాబంధు - నిచయమనుచు
మదిని నేనెంచియున్నాఁడ - మదనజనక 45

సీ॥ అర్కకులేంద్ర న - న్నాదరించు మటన్న
నాయాస మాయనా - యంబుజాక్ష
పక్షివాహన నన్ను - పాలింపరాయన్న
బలుకవ ద్దేమొకో - పంకజాక్ష
గరుణతో ననుబ్రోచి - కడ తేర్చుమాయన్న
నిరతంబు నేలవే - నీరజాక్ష
దనుజారి నను వేగ - దయజూడరాయన్న
దాక్షిణ్యమున దీర్ప - దలఁచు కాంక్ష

గీ॥ చక్రి నీస్తుతి ననిశంబు - సలుపుచున్న
కరుణ యొక్కింతయైనను - గలుగదాయె 46

సీ॥ పౌండరీనాథ నా - రెండు కన్నులతోడ
నిన్ను జూచెడి పుణ్య - మెన్నడయ్య
అనవరతంబు నా - మనమందు నీభక్తి
దప్పకుండెడి కాల - మెప్పుడయ్య
వీనుల నీకథల్ - విని సంతసిలు భాగ్య
రేఖ నానొసలుపై - లేదటయ్య
నీభక్తవరులతో - నిరతంబు వసియింప
గల భాగ్య మిచ్చి నన్ - గావుమయ్య

గీ॥ ఇంత పంతంబు వలదు నా - వంతమాన్పు
కంతుజనక రమానాథ - కరుణజూడు 47

సీ॥ అన్నిరోగంబులు - నాక్షణంబున బాప
హరినామసుధ జుమీ - యౌషధంబు
తాపత్రయాభీల - దావాగ్ని నార్పంగ
వైకుంఠు స్మరణమే - వృష్టి యరయ
అజ్ఞానకలిత మహాతి - మిరము౯ బాప
హరిస్మరణంబునా - హస్కరండు
భూరిపాపపు పేరు - వారాసులింకింప
పద్మాక్షుస్తుతి బడ - బానలంబు
గీ॥ నితర చింతల నే బాసి - యెల్లవిధుల
నిన్ను నిరతంబు నాత్మలో - నెంచువాడ 48

సీ॥ మందమతీయని - కొందరాడిన నేమి
పిచ్చివాడని నన్ను - బిలువ నేమి
బుద్ధిహీనుండని - పొసఁగనాడిన నేమి
పాపకర్ముండని - బలుక నేమి
కరుణాలయుండని - ఘనతఁ జేసిన నేమి
పెను లుబ్ధుఁడని జనుల్ - బిలువ నేమి
కడిదిశూరుండని - కఱకు లాడిన నేమి
కఠిన చిత్తుండని - గసర నేమి
గీ॥ అజ్ఞులగు లోకులెట్లు - నన్నాడుకొనిన
చెలఁగి నీభక్తియుండినఁ - జాలునయ్య 49

సీ॥ అతిముదంబున గల్ల - లాడ నేర్చితిగాని
సూనృతోక్తులు జిహ్వా - నుడివి యెఱుఁగ
కార్యముల్ జెఱుపఁగ - గడఁగి నేర్చితిఁగాని
పరులకెప్పుడు సాయ - పడి యెఱుంగ
అన్యుల సొత్తుల - కాసఁ జెందితిఁగాని
చేయెత్తి ధర్మంబుఁ - జేసి యెఱుఁగ
జీవహింస సతంబు - జేయ నేర్చితిఁగాని
జీవకారుణ్యంపు - చింత యెఱుఁగ

గీ॥ పరమపాతకుఁడను నేను - బరమపురుష
తప్పులన్నియు మన్నించు - దయదలంచు 50

సీ॥ భక్తితో తలమోడ్చి - బ్రణుతిఁ జేయుచునున్న
కరుణజూడ వదేమి - కఠినమయ్య
నీదుభక్తుఁడనంటి - నిన్ను నమ్మికయుంటి
నాదువంకల నెన్న - న్యాయమయ్య
నినుదలంచుచు నున్న - నీభక్తుఁడగు నన్ను
జేపీడ నేనేమి - జేసితయ్య
విదురాంబరీషులు - వేన వేలిచ్చిరా
ద్రౌపది తానేమి - దోచిపెట్టె

గీ॥ వారికై వడి నన్నేలు - వారిజాక్ష
పుష్పపత్ర ఫలంబుల - పూజసేతు 51

సీ॥ నీ దాసకోటుల - నిన్ను గన్నట్టుగాఁ
జేతులెత్తుక నుతుల్ - జేయువారు
భక్తులెల్లరు నీదు - భజనం బొనర్పఁగా
వీనులు దనియంగ - వినెడివారు
తన పీటికిని దాస - తండంబు లరుదేర
బ్రీతిమీరఁగ విందు - బెట్టువారు
జాతి వివక్షత - సల్పక ప్రజలను
నన్నదమ్ముల రీతి - నరయువారు
గీ॥ నీదుభక్తులు నిజముగా - నిర్మలాత్మ
కాంచనాంబర నను కృపఁ - గాంచవయ్య 52.

సీ॥ మిగులరోగములకు - మీపాద తీర్థమే
చాలు మందులపొంతఁ - జనఁగ నేల
భయవేళ్ళనామ - పఠనమేచేయూత
తదితర మంత్రము - ల్దడవుటేల
ఆశ్రిత రక్షకుం - డౌనీవు గలుగఁగా
నరులను జేజాచి - యడుగనేల
లక్ష్మీశు కరుణా క - టాక్షంబు గల్గగా
ఘోరదారిద్ర్యాగ్ని - గుంద నేల
గీ॥ కామగవియు జింతామణి - గల్ప తరువు
గల మహేంద్రుని మీరెద - ఘడియలోన 53

సీ॥ అన్నంబు గొఱకునై - యన్యులందఱిఁ జేరి
బలుకష్టముల పాలు - బడఁగ వలసె
అభిమాన మొక్కటి - నలమి యుండఁగగదా
యొరులనుగని భీతి - నొందుగవలసె
ఆలుబిడ్డల పోషణా - భారమున గదా
పడరాని యిడుములఁ - బడఁగవలసె
దారిద్ర్యదోషంబు - దగిలి యుండఁగగదా
చేరిలుబ్ధుల సేవఁ - జేయువలసె

గీ॥ జటుల సంసారజనిత - దుర్ఘటి వినూత్న
కష్టముల జిక్కకుండఁగ - గావుదేవ 54

సీ॥ మునిముఖ్యులెల్ల నీ - మోహనాకారత
దర్శించి నినుజేర - దలఁప లేదె
వ్రేతలెల్లను నిన్ను - బ్రీతిమై గాంక్షించి
విరహానలంబున - వ్రేగలేదె
మారుతి నీసేవ - గోరిచేయఁగ బూని
పడరాని యిడుములఁ - బడగలేదె
మధుపుర వీధుల - మానినుల్ నీరూపు
జూచియు మరిగోరి - చూడలేదె

గీ॥ మన్మథాకార నీరూప - మరసినంత
కామమో ప్రేమయో - యొండుగానుపించు 55

సీ॥ రామ నామామృత - రసము భర్గుఁడెఱుంగు
నోనర నీమూర్తి భ - వాని యెఱుఁగు
సర్వనీయం తృత్వ - సరణి బ్రహ్మయెఱుంగు
శుభగుణంబు మృకండ - సూతియెఱుఁగు
వరలు సర్వవ్యాప్తి - వైరోచని యెఱుంగు
కార్యసాధకతను - గావ్యుఁ డెఱుఁగు
మిత్రిభావము పృథా - పుత్రుఁడెరుంగును
సత్యవత్సలత పాం - చాలియెఱుఁగు

గీ॥ గానియజ్ఞులు నిన్నెట్లు - గాంచఁగలరు
నన్ను రక్షించువేవేగ - సన్నుతాంగ 56

భక్తులదృష్టికి - బడుదునోయని భీతి
క్షీరసాఁగరమును - జేరినావు
దాసులెల్లరు నీదు - దరిజేరకుంటకై
పన్నగేంద్రుని పైన - బండినావు
భాగవతులు నీదు - పజ్జజేరెద రంచు
రెక్కలుగల తేజి - నెక్కినావు
యతులు నిన్ వెదకుచు - నే తెంతురనియేమొ
తెలిదీవికై బయల్ - దేరినావు

పీరుజేసిన తప్పేమి - విశ్వరూప
గలసి మెలసియు యుండుట - ఘనముగాదె 57

సీ॥ మానసంబున మిమ్ము - మనన జేయుటయొండు
తనువున మీసేవ - దలపరెండు
వాక్కున మీకథల్ - వర్ణించుటది మూఁడు
వీనుల మీకథల్ - వినుట నాల్గు
సఖ్యంబు మీయెడ - సల్పుటనదియేను
నీయెడ దాసుఁడై - నెనరుటారు
వందనార్చనజేసి - వర్తించుటయు నేఁడు
ఆత్మ యందునజేర్చ - నష్టవిధులు

గీ॥ పరతమిము నవరీతుల - బాయకుండు
నతనికిని ముక్తి - నరచేత నమరియుండు 58

సీ॥ విశ్వమంతయు నిండి - వెలయుచునుండు నీ
కాలయంబును నేను - గట్టగలనె
రూపంబులేని చి - ద్రూపివుండ వగునీకు
రూప మొక్కటి ని - రూపింపఁగలనె
వక్షస్థలంబున - లక్ష్మియుండిన నీకు
శృంగార మేరీతి - సలుపగలను
సర్వజీవులకు గ్రా - సం బొసంగెడి నిన్ను
భక్ష్యాదులను దృప్తిఁ - బరుపఁగలనె

గీ॥ నిఖిల కల్యాణగుణనిధి - నిగమ వినుత
నాదిదేవ నుతింతు నే - ననుదినంబు 59

సీ॥ నాభీసరోజంబు - నను నజుఁ గల్పించి
జీవసృష్టి యొలర్పఁ - జేసినావు
విష్ణునామంబున - విశ్వజాలంబుల
పాలనం బొనరింపఁ - జాలినావు
ఫాలదేశంబున - భర్గునిఁ గల్పించి
విలయం బొనర్పఁగా - వెలసినావు
సమవర్తి సంజ్ఞ చే - సరవి ధర్మాధర్మ
పరిశీల నాధ్యుఁడై - ప్రబలినావు
గీ॥ సకలదేవత మయమూర్తి - సర్వసాక్షి
వైన నిన్నెన్న దరమె య - సంతతాప 60

సీ॥ సకల విదాహ సం - చయ వహ్ని నార్పంగ
వారిదంబగు హరి - వర్ణనంబు
సంసారసాగర - సలిలంబు దాఁటఁగ
వనజాక్షు స్మరణమె - వఱలునావ
అజ్ఞానకలిత మ - హాంధకారమునకు
రవిసదృశంబు శ్రీ - రామజపము
దారుణదుఃఖ భూ - ధరచయంబును గూల్ప
హరిచింతనంబు వ - జ్రాయుధంబు
గీ॥ భక్తులెల్లరు నినుగూర్చి - ప్రతిదినంబు
వినుతి సేయంగ విందునో - విమలచరిత 61

సీ॥ గాన మాధురి నిను - మానుగా మెప్పింప
మధుహంత నారద - మౌనిగాను
తపమున మెప్పింప - దయకు పాత్రితగాంచ
పరమేశ యాత్తాన - పాదుగాను
అవిరళభక్తి శ్రీహరి - నిను మెప్పింప
దానవభర్త నం - దనుఁడ గాను
సాహస కార్యాళి - సవినయోక్తులఁ జేయ
మతినెంచ నంజనా - సుతుఁడఁగాను

గీ॥ అర్జుఁ డనిపించుకొన్నాఁడ - నబ్జనాభ
నమ్మియున్నాఁడ నిను మది - నాగశాయి 62

సీ॥ న్యాయవంతుండన - నాయన నీవెగా
పదునాల్గు భువనముల్ - పంకజాక్ష
ధర్మపదార్థంబు - తండ్రి నీవేగదా
యొండొరు లుండుట - యెఱుగనయ్య
ననుకంప నీయుండ - వునునీవెగాహరీ
సకల చరాచర - సంఘమెఱుఁగ
ఆత్మ బంధుండన - నయ్య నీవేగదా
భక్తాళికెల్ల ప్రా - భవ మెసంగ

గీ॥ నింతకన్నను మంచి వా - రెందుగలరు
సకల జగముల రక్షింప - జాలువాఁడు 63

సీ॥ ఎక్కవాహనము లే - దేమొగా నిట్టులఁ
బుల్లునెక్కఁగనేమి - బుట్టెనయ్య
పండఁ బానుపాకండు - నుండలేదో చిల్వ
పైఁ బండనెంత ని - ర్భాగ్యమయ్య
వసియింపగా దివ్య - భవనంబు లేదె యం
బువుల నుండఁగ నేమి - పొసఁగె నయ్య
నీవారలెవ్వరు - నినుజేర గా రారె
యొక్కఁడవై వార్ధి - నుందువేల
గీ॥ సకలసంపద లొసఁగెడి - సాధ్వి నీకు
కూర్మిసతిగాఁగ లేములు - గోరనేల 64

సీ॥ సావధానముగ మీ - స్మరణ జేయుదమన్న
తాపత్రియంబు నక - దరల దేమొ
అనవరతము నిన్నె - యర్చింత మన్నను
సంసారమోహంబు - సమయ దేమొ
నిశ్చలంబుగ భక్తి - నిలుపుద మన్నను
మానసం బొకచోట - మసల దేమొ
నిరతంబు నీకథా - నీక మాలింపగా
నింద్రియాళికి బుద్ధి - యొసఁగ దేమొ
గీ॥ జనన మరణ ప్రకార సం - జనిత ఘోర
సాగరం బెట్టు నీదుదు - జలజనాభ 65

సీ॥ పరితాపమున శిల - పగిది నున్న యహల్య
రక్షించి మించిన - రామచంద్రి
పూతన దానవి - పాతకి చనుఁదా్రవి
ముక్తి నొందించిన - మురళిహస్త
దనుజుని ద్రుంచి త - త్తనయుని ప్రహ్లాదు
నరసి రక్షించిన - నారసింహ
బలిని బంధించి యా - బలసూదనుని కెల్ల
భోగంబు లొసఁగిన - బుట్టువడుగ

గీ॥ అబ్ధినిఁ సోమకుని జీరి - యబ్జభవుని
మేటి వేదంబు లొసఁగిన - మీనరూప 66

సీ॥ నేర్పరినంచు నే - నిక్కంగ నేమాయె
కార్యజ్ఞు లిలను బల్ - గలిఁగియుండ
బలవంతుఁడ నటంచు - బలికిన నేమాయె
బలవంతులకు - బలవంతు లుండ
విద్యాధికుఁడ నంచు - విఱ్ఱవీగఁగ నేల
బహువిధ పండితుల్ - ప్రబలుచుండ
దాత నటంచును - దలఁచిన నేమాయె
కల్ప దుమ్రంబులౌ - ఘనులు నుండ

గీ॥ పుడమి ఘనతను గాంచగా - పురుషుఁడెవఁడు
అల్పనరునకు - సాధ్యమా యవనియందు 67

సీ॥ ప్రత్యూష వేళలో - బాన్పుపైనుండి యే
నిన్ను స్మరించి మా - నితపు భక్తి
గాలకృత్యంబులు - గావించి సుస్నాన
మొనరఁగ ధ్యానింతు - నో మహాత్మ
పూజనం బొనరించి - పొసఁగ భుజించి నీ
కథ లాలకించెద - గౌరవమున
సకల కర్మంబులు - సలుపుచు నన్నియు
నీకె యర్పించిన - నీతి నెవఁడు

గీ॥ వాఁడెపో భక్తుఁడనఁగను - వసుధలోన
పోరు బడలేక నీభక్తి - బూననేల 68

సీ॥ పుట్టుట మొదలుగా - బూని సుకార్యంబు
లొనరించి యెఱుఁగ నే - నొక్కనాఁడు
బాల్యమునుండి యే - పద్మాక్షు పూనికె
యొనర భజింప నే - నొక్కనాఁడు
జఱుగునంతట సాధు - జనుల కింతేనియు
నోగిరంబును బెట్ట - నొక్కనాఁడు
మాట మాత్రికునేని - మఱచి యేచేయను
లోకోపకార మే - నొక్కనాఁడు

గీ॥ యిట్టి పాపాత్ము బ్రోవ యిం - కెట్టు లొక్కొ
యనుచు భావింపబోకుమీ - యంబుజాక్ష 69

సీ॥ రూపంబులేక ని - రూపుఁడనై యుండి
స్థాణురూపము నొంది - తరు లతాది
రూపంబునొంది యా - రూఢత నీస్వేద
జములనై బిదప నండ - జము నగుచు
తిర్యగాకృతి నొంది - తివిరి మానవరూపు
మలవడె నీకృప - నబ్జనాభ
లక్షల కొలఁదిగా - యీక్షితి జన్మించి
కలఁత నొందఁగినాయె - కమలనాభ

గీ॥ సరగ లెక్కింపగా కోట్ల - సంఖ్యగలుఁగు
జన్మములనెత్తి యలసితి - జాలు నయ్య 70

సీ॥ అరయ జన్మములెత్తి - యాయాస పడనేల
భవబంధముల జిక్కి - బ్రిదుక నేల
మరణబాధల జిక్కి - మ్రగ్గిపోవఁగ నేల
చిత్తంబు వికలత - హత్త నేల
నీషణత్రయముల - నిక్కి స్రుక్కఁగ నేల
భూరి సంసారాబ్ధి - భృంగ నేల
కామలోభాదుల - గాసియు పడనేల
దండధారుని భీతి - దలఁపనేల

గీ॥ అన్ని రుజలను మాన్పు ది - వ్యౌషధంబు
నెలమి నీస్తుతి దప్ప - నింకేది గలదు 71

సీ॥ పరులను నిందించు - పాపపు నీ జిహ్వ
నిన్ను కీర్తింపఁగ - నేర దేమొ
పరుల విత్తమునకై - పరువిడు చిత్తంబు
నీయెడ క్షణమైన - నిలువ దేమొ
వినరాని బూతులు - విననేర్చు కర్ణంబు
లోయయ్య నీకథ - లొల్ల దేమొ
కఠిన కార్యాళికి - గడఁగు నీకరములు
నన్ను నిన్ బూజింప - కున్న వేమొ

గీ॥ ఇట్టి పోకలు నీయిచ్చ - నెల్ల యెడల
బోవగానీక యింద్రియ - బుద్ధి గరపు 72

సీ॥ మాధవనామంబు - మరువకుండెదమన్న
మగువల చేఁజిక్కి - మరతునేమొ
కేశవనామంబు - కీర్తింతమన్నను
ధనకాంక్ష నామదిఁ - దగులునేమొ
విష్ణుసంకీర్తనల్ - విడువ కుండెదమన్న
విమల సుఖాళిచే - విడుతునేమొ
దామోదరుని భక్తి - దలగకుండెద మన్న
మరణ భయంబున - మరతునేమొ

గీ॥ ఇట్టి యాటంకములనెల్ల - నిప్పుడైన
బాపి కాలుని భయమును - బాపి బ్రోవు 73

సీ॥ కాలదూతలు వచ్చి - కడకు జీవము గొని
పోవు నప్పుడు నన్ను - బ్రోవుమయ్య
తల్లిదండ్రులు నన్న - దమ్ములు కాంతలు
రారు బంధుగులు - రక్షింప నప్పుడు
యమబాధలను బాపి - యరసి రక్షింపఁగా
నీవొక్కఁడవె దిక్కు - నిలువుమయ్య
నిరతంబు నిన్ను ధ్యా - నింతు నింతియె కాని
దిక్కు లేదింక వేరు - దీనరక్ష
గీ॥ నన్ను జెయివీడబోకుమా - నాథ యిప్పుడు
కోరి భజియింతు నాశక్తి - కొలఁది నిన్ను 74

సీ॥ దోషినై యాత్మాభి - లాషినై యనృతంపు
భాషినై క్రోధసం - తోషి యగుచు
క్రూరుఁడై యాచార - దూరుఁడై పాపసం
చారుఁడై మూఢుఁడై - జారుఁ డగుచు
కామినై దుష్కళా - గామినై పుణ్యావి
రామినై దోషంపు - భూమి యగుచు
మోహినై బుధజన - ద్రోహినై బుద్ధి కా
లాహినై గర్వసం - గ్రాహి యగుచు
గీ॥ నధముఁడైన నజామిళు - డంతమునను
తనయు బేర్కొన్న బ్రోవవే - తథ్యముగను 75

సీ॥ హరి ముకుంద జనార్దనా - జగద్రక్షక
పాపసంహారరయో - పరమపురుష
నరసింహా కేశవ - నారాయణాచ్యుత
భక్తవత్సల కోటి - భాను తేజ
శ్రీనాథ మునిజనార్చిత - సింధుగంభీర
గరుడవాహన కృష్ణ - కమలనయన
వాసవార్చిత పాప - వల్లిచటులపిత్రి
వేదవేద్య పురారి - వినుతకీర్తి

గీ॥ ఈశ యభవ మురారి - దిగీశ వినుత
సమదదానవకుల శిక్ష - సర్వరక్ష 76

సీ॥ నిన్ను వీక్షింపక - నీనికల్ సృజియించె
నిను నుతింపగ జిహ్వ - నొసరజేసె
మునుకొని నీకథల్ - విన కర్ణములనిచ్చె
భజియింప జిత్తంబు - బాదుకొల్పె
నుతు లొనర్పఁగ మూర్ధ - మతులితగతి నిచ్చె
సరవి బూజింప హస్తము లొసంగె
నీయాలయంబున కే - నేగ చరణముల్
కృప నొసంగెను నాకు - కమలభవుఁడు

గీ॥ అట్టి యింద్రియములను నీ - యర్చనంబు
నందు వినియోగపెట్టక - నిందురైతి 77

సీ॥ అతి క్లేశభూయిష్ట - మైనట్టి యాతనా
వకట నాకేటికో - వికలుఁ డగుట
జననంబు మరణంబు - జాల సంతాపంబు
బాల్యంబు ముదిమి బా - పములు గనుట
క్షుత్పిపాసలు తృష్ణ - స్రుక్కుట లేమియు
రోగంబులను బొంది - రోత గనుట
ఘోర సంసారాంధ - కూప భయంబును
బహు దుఃఖముల జిక్కి - బాధ పడుట

గీ॥ వలదు జన్మంబు ముమ్మారు - వలదు వలదు
తలచి నంతనె గుండెలు - తల్లడిల్లు 78

సీ॥ నరకుని చెరనున్న - నగనాథ కన్యల
మానంబు గావవే - మహిత తేజ
బార్హద్రథుని చెర - బాపి క్షత్రియకోటి
నరసి రక్షింపవే - యంబుజాక్ష
ద్రోవది సభలోన - దీనయై నిన్వేడ
గాంచి రక్షింపవే - కంసవైరి
పిడికెడటుకులుగొని - పేద కుచేలుని
కఖిలార్థముల నీవె - యమలచరిత

గీ॥ వారిభంగిని నితరము - గోర లేదు
ముక్తిపదమిచ్చి బ్రోవుము - ముదముతోడ 79

సీ॥ కరిరాజవరద నీ - గలువరించిన గాని
మాటాడవేల జల్ - మాని రీతి
తాపసమందార - దయజూడు మన్నను
బలుకవైతివి దుష్ట - జలుల రీతి
దాతవయా దయ - దలపు సుంచని వేడ
ధన మదాంధుని రీతి - దలపవైతి
వా ర్తరక్షక యంచు - ప్రార్థించినం గాని
పెడమోముబెట్టి నీ - జూడవేల

గీ॥ ఎంతవేడిన బలుక - వేనేమిసేతు
కంతుజనక, రమానాథ - కన్నతండ్రి 80

సీ॥ కన్నగర్భములందు - గలకాల మీరీతి
పుట్టి గిట్టఁగలేను - బుణ్యపురుష
తాపత్రయాభీల - దావాగ్నిజనితమౌ
బాధల బడజాల - పద్మనాభ
సంసారసాగర - సంతరణం బేను
గావింపగా లేను - కమలనయన
ఐహిక సంజని - తానేక దుఃఖాళి
నోర్వంగజాల నో - యుదధిగేహ

గీ॥ ఆశపాశంబులను ద్రెంచి - యజ్ఞనాథ
నీదు సామీప్యమిచ్చి న - న్నేలుమయ్య 81

సీ॥ తిమిరారి దీధితుల్ - తిరుగఁబారిన యట్లు
విధులందు చంద్రికల్ - విడువ నట్లు
సౌరభంబును సుమ - సమితి వీడని యట్లు
కుండలంబుల కాంతి - కుందనట్లు
అమృతంబునను రుచి - యలవడి యున్నట్లు
జ్వలనంబునను వేడి - సమయ నట్లు
అవని పాషాణంబు - నమరియుండిన యట్లు
కామంబునకు దృష్టి - గలుగ నట్లు
గీ॥ జేయుమా నాథ నిన్నెప్డు - బాయకుండ
నామదిని నిన్ను ధ్యానింప - ననవరతము 82

సీ॥ రామనామమె ముక్తి - రాజ పథంబును
రామనామమె సదా - రక్షయరయ
రామనామమె శుభా - రంభ జంతతమును
రామనామమె బుధ - రత్న నిధియు
రామనామమె గదా - రక్షణార్థ ఫలంబు
రామనామమె మంత్రి - రాజ నిధియు
రామనామమె యోగి - రాజ సుహృద్యంబు
రామనామంబు - వి రామ మెఱుఁగ
గీ॥ అట్టి శ్రీరామనామంబు - ననుదినంబు
మననమును జేయు వాఁడెపో - మాన్యుఁడవని 83

సీ॥ అనుకూలవతియగు - నబ్జాక్షితో గూడి
కామసుఖంబులు - గంటి దృప్తి
తల్లిదండ్రియు భ్రాతృ - తతి పుత్రులను గూడి
కొదువలేకుంటి నో - కోమలాంగ
గ్రాస వాసంబులు - గల్గ తోచిన రీతి
నభ్యాగతుల పూజ - లవని జేసి
యున్నదానితో దృప్తి - నొంది నీభజనంబు
సతతంబు సల్పుదు - సాధువితతి

గీ॥ చాలు నీజన్మమింక సం - సారసుఖము
పాదసన్నిధి ననుజేర్చు - పంకజాక్ష 84

సీ॥ మత్స్యరూపక నన్ను - మన్నించి బ్రోవుమా
కమఠరూపక నన్ను - గావుమయ్య
భూధరరూప నన్ - బ్రోవుమా నిరతంబు
నరహరిరూప న - న్నరయు మయ్య
వటురూప శ్రీశ నన్ - వరుసతో రక్షింపు
భార్గవరామ నన్ - బాయకయ్య
శ్రీరామ నన్నెప్డు - చేరి కాపాడుము
హరికృష్ణమూర్తి న - న్నరయు మయ్య

గీ॥ బుద్ధరూపక ననుగావ - బుద్ధి దలపు
కలికి రూపంబుజూపుట - ఘనతరంబు 85

సీ॥ భజియించు వారలు - భాగ్యదేవత లంచు
చిఱ దరిద్రింపు కు - చేలుఁ డెఱుఁగు
ర_క్తి దీనులపాలి - రక్షకుండ వటంచు
గష్టంబు నొందిన - గజ మెఱుంగు
ఆర్తుల గావఁగా - నాధార మీావని
పాండవపత్ని - పాంచాలి యెఱుఁగు
భ_క్తజనములపాలి - పరమదైవ మటంచు
దనుజాధినాథుని - తనయుఁ డెఱుగు

గీ॥ మిత్రవాత్సల్య మారవి - పుత్రుఁ డెఱుగు
యెంచ నాబోటి మూర్ఖుఁ - డేమియెఱుగు.86

సీ॥ కాయంబుపై ప్రేమ - గల దగ్గలము జీవు
నకు దానకష్టంబు - వికలుఁ డయ్యె
ముదిమిచే వడకిన - మో మెంతవాడిన
దంతంబు లూడిన - తమక మయ్యె
బధిరత వచ్చిన - భంగంబు గల్గిన
స్వార్థపరత్వంబు - సన్న మయ్యె
మరణోన్ముఖుండౌచు - మంచంబు బట్టిన
కాలదూతలు రాగ - గష్టమయ్యె

గీ॥ అరయ నెన్నేని యాపద - లలముకొనిన
బాయగా లేను మోహావి - భ్రాంతుఁ డగుచు87

సీ॥ అమరారి తమ్ముండ - కభయం బొసంగితి
యినకులతిలక నీ - వెందుచేత
తేరు మూషికంబును - దయతోడ లాలించి
తిందిరారమణ నీ - వెందుచేత
దండకాటవి ఋషి - కాండంబు గాచితి
యీశ రమానాథ - యెందుచేత
అల కిరాటవధూటి - కమరపదం బిచ్చి
యొసగ బ్రేమను బ్రోచి - తెందుచేత

గీ॥ ఇలను సాధుల రక్షింతు - వెందుచేత
నట్టి ప్రేమను బోరివు స - న్నాదిదేవ 88

సీ॥ వారాసు లేకమై - వర్తిల్లునప్పుడు
మఱ్ఱియాకున నున్న - కుఱ్ఱఁ డెవఁడు
పాల మున్నీటిపై - వటపత్రశాయియై
పొలుపార పవళించు - పురుషుఁ డెవఁడు
సచరాచరములైన - జగములఁ బుట్టింప
తమ్మిచూలిని గన్న - తండ్రి యెవఁడు
బ్రహ్మాండచయమెల్ల - భస్మమైపోవ న
క్కిటియయ్యు వర్తించు - వటుఁడెవండు

గీ॥ సకలజగముల రక్షించు - జాణయెవఁడు
అట్టి నిను భక్తి ధ్యానింతు - ననవరతము 89

సీ॥ కరములు ముకుళించి - కడు ముదంబున నాదు
శిరమున నిడుకొని - సేవజేతు
చరణముల్ నొవ్వ వే - సారక నీభవ
నంబున కేతెంచి - నతు లొనర్తు
గళము నొవ్వగ రామ - కరుణించరాయని
పలుమారు నిన్ను నే - బ్రస్తుతింతు
వీనులవిందుఁ గావించు - నీకథలను
నానందమున విని - యాశ్రయింతు

గీ॥ ఇట్టి భక్తుని గరుణించి - యేలకున్న
నీకు దుష్కీర్తివాటిల్లు - నిశ్చయముగ 90

సీ॥ ఇది నాదు గేహమా - యిది నాసతీమణి
యన్న మోహంబున - కొన్నినాళ్ళు
ఇది నాపొలంబుసు - మ్మిది నాఫలంబని
యున్న మోహంబున - కొన్నినాళ్ళు
వీరు నాతనయులు - వీరు నాతనయలు
నన్న మోహంబున - కొన్నినాళ్ళు
ఇది నాపశుసమూహ - మిదినావసుసమూహ
మన్న మోహంబున - కొన్నినాళ్ళు

గీ॥ గడపితిని నాయువెల్ల నా - కర్మపాశ
ములను త్రెంచెడి - మార్గంబు తెలియలేక 91

సీ॥ వసులోభమును జేసి - వర్తింపకుండఁగ
పరదారలను జూచి - భ్రమియకుండ
ఒఋల సంపదలకు - నోర్వలేమి ఘటిల్ల
కన్యలసొత్తుల - కాసపడక
అనృతంబు నాలుక - యావలనుండఁగ
ధర్మేతరంబులు - దగలకుండ
ప్రాణిహింసకు బుద్ధి - పరుగిడరాకుండ
నన్యచిత్తములందు - నరుగకుండ

గీ॥ సత్స్వభావంబు గల్పించి - జగతియందు
మోక్షమార్గంబు - జూపుమో పక్షితేజ 92

సీ॥ అజ్ఞాన తిమిరాప - హార మార్తాండుడో
ననయంబు నీనామ - మంబుజాక్ష
ధర నవిద్యామూల - తాపోపశమనంబు
నీదు సంకీర్తన - నిగమవినుత
పాప ఘనాఘనా - పవమానసదృశంబు
నీపాదభక్తి ము - నీంద్ర మోక్ష
సంసార దావాగ్ని - జల్లార్ప నీనామ
మమృతాభిషేచన - మార్యవినుత

గీ॥ అట్టి నీనామమును భక్తి - ననుదినంబు
నిచ్చలు జపింప - జెముడు దానెట్లువచ్చు 93

సీ॥ రామ భానుకులాబ్ధి - సోమ యిందీవర
శ్యామ రాక్షసభీమ - శరణుశరణు
విష్ణు సామ్యప్రదీప - జిష్ణు లోకప్రతాప
శక్రమిత్ర మురారి - శరణుశరణు
అదితేయ సుపోష - యాదవాన్వయ భూష
శ్రీరమానాయక - శరణుశరణు
మానిబృంద విహార - మంగళతర హార
సకలరక్షక నీకు - శరణుశరణు

గీ॥ జలజలోచన నీకిదే - శరణుశరణు
సారసాక్ష హృషీకేశ - శరణుశరణు 94

సీ॥ ఈశుండునీవె లో - కేశుండునీవె సం
తోషుండునీవె స - ద్రూపమీవె
నిజదేవుఁడవు నీవె - సుజనాత్మకుఁడవీవె
నిజజనకుఁడ వీవె - నాత్మవీవె
విశ్వంబులును నీవె - విశ్వపాలకుఁ డీవె
విశ్వమయుం డీవె - వేల్పునీవె
సర్వంబులును నీవె - సర్వసాక్షియు నీవె
సర్వాలయంబుల - స్థాణుఁడీవె

గీ॥ అనుచు నేవేళ మిమ్మాత్మ - నరయుచుండు
భక్తకోటిని నను జేర్చి - ముక్తినొసఁగు 95

సీ॥ శ్రీరామనామమే - చింతనామృతమును
శ్రీరామనామమే - శివకరంబు
రఘురామనామమే - రమ్యాంతరంబును
రఘురామనామమే - రక్షణంబు
జయరామనామమే - శాశ్వత సుఖమును
జయరామనామమే - శుభకరంబు
హరి రామనామమే - దురితవిదూరంబు
హరి రామనామమే - యమహరంబు

గీ॥ శ్రీనివాసుని నామంబు - చెడనిధనము
నాదిలక్ష్మీశ నినుదక్క - నన్యమెఱుఁగ 96

సీ॥ సర్వాత్మునకిదే - సాష్టాంగవినతులు
వసుదేవనందనా - వందనంబు
పరమాత్మ నీకిదే - ప్రణుతిసహస్రంబు
రఘుకులదీప శి - రంబు మోడ్తు
నారాయణ పరేశ - నతులొనరించెద
దానవాంతక యిదే - దండమయ్య
యాదవాన్వయ నీకు - మోదంబులొనగూర్తు
ప్రద్యుమ్న జనక నీ - భక్తిగొలుతు

గీ॥ శ్రీరమావర నీకు - జోహారు జేతు
నన్ను వేవేగరక్షించు - కన్నతండ్రి 97

సీ॥ నారాయణానాథ - నాథ జగన్నాథ
మించి ప్రేమమున - పాలించవయ్యా
భక్తవత్సల నీకు - భజన సల్పెదనయ్యా
కారుణ్యమున నన్ను - గావవయ్యా
దాసవందిత నీకు - దోసిలియొగ్గితి
భక్తుని జేపీడ - బాగటయ్యా
ఇనవంశతిలక నీకెవ్వరు - సములయ్యా
నేర్పుతో నను దరి - జేర్పవయ్యా
గీ॥ నిన్ను గనుగొని సేవింప - నెవరితరము
నన్ను దరిజేర్ప - నన్యులున్నారటయ్యా 98

సీ॥ ప్రాయంబు గడచె నా - కాయంబుజవమెల్ల
డించె సంగంబులు - గందఁబారె
రూపంబుమారెను - చూపుమధ్యంబాయె
కాలుచేతులు వడఁకె - కలఁతలిచ్చె
కర్ణముల్ బధిరత - గనుప్రొద్దువాటిల్లె
నాశాపిశాచంబు - లలముకొనియె
శిరము పాండురమాయె - చేష్టలు మెండాయె
పరుల యాదరమున - బ్రతుకవలసె
గీ॥ నిట్టిహేయంపు జీవ - నం బేల వలదు
దిక్కు నీకన్న నెవరింక - దీనపోష 99

సీ॥ అద్వితీయుండ వ - నంతనాముండ వ
నంతరూపుఁడ వీ - వనంతశక్తి
పరుఁడవ్యయుఁడ వీవు - పరమేశ్వరుండవు
పరమాత్ముఁడవు పర - బ్రహ్మమీవు
నిత్యుండ వరయంగ - నిగమాంతవేదివి
రక్షకుండవు సర్వ - సాక్షివీవె
విశ్వస్రష్టవు నీవు - విశ్వపోషకుఁ డీవు
విశ్వహంతకుఁడీవు - విశ్వవేద్య
గీ॥ వందనముజేసి నుతియింతు - వనజనాభ
తప్పులన్నియు మన్నించు - దయదలంచు 100

సీ॥ వసుదేవనందన - వనజనాభ ముకుంద
వసుమతీశ తలంతు - విసుఁగులేక
సనకాది సన్నుత - సర్వాత్మసంభూత
చరితమెన్నెద నతి - త్వరితముగను
నిగమగోచర వంద్య - వగమాన్వరాయని
సుగుణాఢ్య నిన్ను నే - స్తుతియొనర్తు
అతివంద్య నీయుఁడ - నతి ముదంబొదవగా
నతిభక్తి బూజింతు - నతులితముగ
గీ॥ సతతమును నీదుభజనమే - సారకెపుడు
రక్తిమీఱంగ గావింతు - ముక్తికొరకు 101

సీ॥ దశముఖునను జుని - దయబ్రోచు నప్పుడు
ధనధాన్య మేమిచ్చె - దానవారి
మందరాచల మబ్ధి - మథియింప క్రుంగంగ
నమరు లేమిచ్చి ర - న్నగము దేల్ప
తండ్రి బాధలనుండి తనయుని- రక్షింప
ప్రహ్లాదుఁ డేమిచ్చి - బంపెనయ్య
భూసుర సుతుఁడంతమును - బొందునప్పుడు
భూ దేవుఁ డేమిచ్చె - బుత్రినొసఁగ

గీ॥ వారివలె నన్ను గాపాడు - వారిజాక్ష
ఆశ్రయించితి ననిశంబు - నభయమొసఁగు 102

సీ॥ ఈజన్మమెత్తి నే - నిడుమలలోబడి
స్మరియింప లేనైతి - స్వామి నిన్ను
అర్థంబులేక ఒల్ - సార్థకంబగు పనుల్
జేయనేర్వఁగ నైతి - జలరుహాక్ష
బ్రతికినన్నాళ్లు నే - బ్రతుకబోదు నె యిక
బ్రతు కేమి నిజమయ్య - పంకజాక్ష
ఇహము శాశ్వతమని - యెంచితి కొన్నాళ్ళు
దీని నమ్మగరాదు - దీనరక్ష

గీ॥ ఇంతకాలంబు గడపితి - నింకనాకు
నోర్పులేదయ్య నను - దరిఁజేర్పకున్న 103

సీ॥ లక్షలవెలజేయు - రత్నంబు నొక్కటి
నాకొసంగగరాదె - నారసింహ
కోటికివెలజేయు - మేటి కిరీటంబు
నయనంబులకు జూపు - మయ్య దేవ
నవకోటి తేజంబు - నాకు జూపఁగరాదె
ననయంబు నమ్మితి - నబ్జనాభ
సర్వవిధముల మిమ్ము - స్మరియించితిని నన్ను
దయతోడ బ్రోచుట - ధర్మమయ్య

గీ॥ ప్రవిమలానందమున దేల్చు - పరమపురుష
భక్తియే సాధనంబు నీ - ముక్తికొరకు 104

సీ॥ మానవజన్మంబు - మర్మంబు దెలియఁగ
నెవరికి సాధ్యంబు - నవనియందు
భవపాశ బంధంబు - బాయగా నిహమందు
తరమౌనె నరులకు - తపన తేజ
తరతరంబులవారు - దైవంబు నెఱుఁగక
పుట్టుచు గిట్టుచు - బొర్లువార
లనుజూచి దినమును - తనువెందు కనుచును
చింతించు చుందు నో - శ్రీనివాస

గీ॥ అహహ యీజన్మమిఁక నొల్ల నంబుజాక్ష
చిత్తశాంతి ప్రసాదింపు - చిత్ప్రకాశ 105

సీ॥ వసుదేవనందన - వందిత దివిజారి
మాధవా నీకిదే - మంగళంబు
అవ్యయ సురవంది - తాచ్యుత దేవేశ
మారజనకా మీకు - మంగళంబు
అద్భుత విక్రమ - యమలత్రివిక్రమ
మదనమోహన మీకు - మంగళంబు
ధర్మంబు పాలింప - దశ రూపములుదాల్చి
మమతజూపిన మూర్తి - మంగళంబు

గీ॥ మారుతాత్మజనుత మీకు - మంగళంబు
మధువిదారి సుసన్నుత - మంగళంబు 106

సీ॥ మహి ననంతపురాఖ్య - మండలాంతర్గత
ఖాద్రి ప్రాంతంబున - ఖ్యాతిమీరు
పందులకుంట నా - బరఁగు గ్రామస్తుఁడ
గొడిదికాప కులుండ - కోటిరెడ్డి
గృహపవిత్రంబును - గోత్రంబుగలవాడ
నాగిరెడ్డియనంగ - నలరువాడ
హరిభక్తి సుధమది - ననుదినంబును గ్రోలి
శతకంబు జెప్పితి - సవినయముగ

గీ॥ తప్పులను దిద్ది మన్నింపు - దయదలంపు
కాన్కగాగొమ్ము రామ నీ - కరుణజూపు 107

సీ॥ హరిముకుందుని గ్రంథ - మనుదినంబును లేచి
ప్రత్యూషవేళలో - పఠన జేయ
నాయురారోగ్యంబు - లైశ్వర్య సంపద
సతసుతా సోదరుల్ - సఖులుగలిగి
పశుబృందములు హెచ్చి - పాలు వెన్నలతోడ
సస్యసమృద్ధియు - సమతనలుగ
రోగముల్ గలుగక - భోగముల్ పెంపొంది
శాంతి క్షమాదుల - శ్రాంతులగుచు

గీ॥ మంగళంబైన కార్యాళి - మగ్నులగుచు
నంత్యమున విష్ణు సాయుజ్య - మందగలరు 108